ఓం

శ్రీవీరాంజనేయాయనమః.

# యథార్థము

## (లేక పతివ్రత)

ఐదంకములు సాంఘిక నాటకము

[కథ కల్పితము.]

కర్త:

మ॥ రా॥ శ్రీ రాయసం వేంకటరమణయ్య

గోవిందపురం :: గుంటూరుజిల్లా.



పబ్లిషరు:

రామచంద్రయ్య

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

 [వెల రు 1—0—0.

# పాత్రలు



రామం:—(కథానాయకుడు)

మన్మథుడు:—(రెండవ కథానాయకుడు)

మాధవుడు:—(సీత తాత—వృద్ధుడు)

గిరిరావు:—(రామం మిత్రుడు)

పోష్టుమాను:—

భైరవశాస్త్రి:—

బాబు:—(రామం పుత్రుడు)

సీత:—(కథానాయకి)

రాజ్యం:—(రెండవ కథానాయకి)

శాంతమ్మ:—(రామం తల్లి వృద్ధురాలు)



# మ న వి

చ. గురుముఖమైన విద్య నమ ♦ కూరమిచేతను తోచినట్టులీ
కరణిని నాటకంబుగను ♦ కల్పన జేసి రచించి నాడనో
పరమను పూజ్యులార ♦ ఘనపండితులార! మదీయగ్రంథమం
దరయగ తప్పులున్నను బు ♦ ధాగ్రిణులార క్షమింప వేడెదన్.



ఓం

శ్రీవీరాంజనేయాయనమః

# యథార్థము

## (లేక పతివ్రత)

---

### ప్రథమాంకము—ప్రథమరంగము.

---

(రాజేశ్వరి తనగదిలో యేకాంతంగా కూర్చొని తనలో)

ఆహా!

ఉ. సోముడు లేనిరాత్రి గతి ♦ శోధన లేని కవిత్వమట్లు మా
ల్యామము లేని సంబి స్తితి ♦ నాథుడు లేని రణంబురీతి స
త్ప్రేమము లేని పెండ్లివలె ♦ పెద్దలు లేని సభావిధంబు నా
రాముడు లేని మద్హృదయ ♦ రాజ్య మరాజకమాయె నిత్తరిన్.

నిజమునకు నామిత్రబృందమున నెందరు సుందరసుకుమారులు లేరు. వారిని యాసింపని నాహృదయకమలము రాముచెలి మినే యేల యాసింపవలయును. ఆతనికడ యేదియో యసన్య సామాన్యమైన మహాత్మ్య మిమిడియున్నది. నే డింకనూ రా డాయె. యెటకేగెనోకదా. ఆత డరుదెంచకమున్నే అసంపూర్తి గా చిత్రింపబడిన యాతని ఛాయాచిత్తరువును పూర్తి చేసె

రామం—రాజ్యం! పూర్వముకన్నా మిన్నగా నీ వెన్నింటినో గ్రహించుకొనుచుంటివి. చదువమని యిచ్చిన గ్రంథముల నన్నింటిని చక్కగా చదువుచుంటివా యేమి?

రాజ్యం—రామం! చదువుకొనినచో ఇట్టివిషయాల గ్రహించుకో లేమా?

రామం—రాజ్యం! మానవుని గమ్యస్థానానికి చేర్పగలిగేది విద్యే. విద్య లేకున్న యుక్తాయుక్తభావమున తర్కించుకో లేము. తర్కించి ప్రపంచాన్ని ప్రేమింప తెలిసికో లేము.

రాజ్యం—రామం! ప్రేమ మెందుకు వెలుంగును?

రామం—ఋతువు లెందుకు మారును. మేఘము లెందుకు వర్షించును. పుష్పము లెందుకు సువాసనల చిల్కును. చెట్లు ఫలము లెందు కొసంగును. సూర్య చంద్ర గ్రహ తారకలు దివమందు జన్మింపుచూ లయించు లెందులకు? ఈకారణముల గ్రహించుకొన్న ప్రేమ మనుష్యులయం దెందుకు వెలుంగునో యథార్థ మగును.

రాజ్యం—రామం! అవి వాటిధర్మరీ స్వభావములబట్టి యట్లు చేయును.

రామం—మానవు డంతియేకదా? ఆతనిజన్మ ప్రేమించుటకు — ప్రేమించి జీవించుటకు — జీవించి లయించుటకు ... కానా ... ?

రాజ్యం—మరి ప్రేమస్వరూప మొక్కటియేగదా? దాని కిన్ని మార్పు లెందుకూ?

రామం—ప్రేమ ... ... మార్పులు ... ... రాజ్యం! నీయీప్రశ్నలకు సమాధాన మీయను. కొలదికాలములో నీవే గ్రహించుకో గలవు.

రాజ్యం—కారణం?

రామం—నాకే నీప్రశ్నలు ఆశ్చర్యం కలిగిస్తున్నవి.

రాజ్యం—సరే ప్రేమతర్కమునకు స్వస్తి మంగళహారతియని యుం
టిని. తరువాత—

తే. నన్ను నోలలాడించెడి ♦ నవ్యగీతి
భవ్యతరగీతి మాధుర్య ♦ భావగీతి
రాలనైనను గఱిగింప ♦ జాలుగీతి
పాడి నాచేత పాడించు ♦ వరమపురుష!

రామం—నాకు సావకాశంలేదు. నే పోవాలి.

రాజ్యం—రామా! ఎప్పటికి పోవాలీ?

రామం—మావారికడకు. జాబుకూడా వచ్చింది.

రాజ్యం—అనగా మీఅమ్మగారికడనుంచా?

రామం—కాదు, మాతాతయ్యగారి వద్దనుంచి.

రాజ్యం—అబ్బో! అందుకే శాబోలును అత్తగారింటికేగే కొత్తఅల్లుని
మాడ్కి తయారయ్యావు.

రామం—ఔను. అందులో అబద్ధమే మున్నదీ?

రాజ్యం—పోకతప్పదా?

రామం—తప్పదు.

రాజ్యం—మరల మీపునరాగమన మెప్పుడు?

రామం—రేడియోగానానికి రాకతప్పదుగా. శలవు (నిష్క్రమించును.)

రాజ్యం—(తనలో) ఆహా!

తే. కటికిచీకటి గ్రమ్మి వ్యా ♦ త్తండమునకు
సూర్యుడున్నను స్నానవ్య ♦ సూర్య డరుగ
ధ్యేయ మెయ్యది సంగీత ♦ దేవిడిపుడు
బావురనుచున్న దతిబాష్ప ♦ భరిత యగుచు.

పాట

చుక్కలరథములో
ఎక్కి చక్కంగాను
దిక్కులన్నీ చూచియీా
పక్కకే వచ్చితివ చందురూడా నీవు
చిక్కకుంటివియేలొ చందురూడా.

(తెర వ్రాలును)

ద్వితీయరంగము—కర్తపురి.

---

(రామం, సీత)

సీత—చెన్నపట్నంనుంచి వస్తూ నా కేమి తెచ్చారూ?

రామం—ప్రియాణబడలిక తెచ్చా—

సీత—అబ్బా! చెప్పండీ.

రామం—నీ కేదిష్టమో దానినే తెచ్చాను. ఇదిగో పుచ్చుకో.

(అని పట మిచ్చును.)

సీత—(చూచి) దీనిని యెవ్వరు చిత్రించారూ—?

రామం—చెన్నపురిలో ఒకస్నేహితురాలు చిత్రించి నాకు బహుమతిగా యిచ్చింది.

సీత—ఎంతముద్దుగా చిత్రించింది. మీారంటే ఆమెకు అంతముద్దొస్తా,

రామం—అదిగో! ఆ అనుమానపెనుభూతమే. పేదకుటీరాలపై జగడాల జడివాన కురిపించేది.

సీత—ఆమె సవనాగరికురాలు, పైగా మీకు స్నేహితురాలు.

రామం—నీవినిర్మలహృదయాలయములో అనుమానపెనుభూతా లుండవచ్చునా సీతా...?

సీత—ప్రభూ! అనుమానపెనుభూతాలు లేని హృదయాలయా లున్నవా—?

మాధవుడు ప్రవేసిస్తూ—సీతా! ప్రయాణబడలికతో నున్న రామము నకు క్షీరపానీయమును తెచ్చిచ్చావా—?

సీత—ఆప్రయత్నముమీదనే వుంటిని పోతున్నా, తాతయ్యా!

మాధవుడు—నాయనా రామం! చెన్నపురిలో నీవనులన్నీ నెరవేరాయా? మరల మరల పోనవసర ముండదుకదా?

రామం—ఏమో చెప్పలేను తాతయ్యా! నావనులకు తుదా మొద లుండవు. ఐనా సీతను ఇకముందు విడచి దీర్ఘకాలము వొంట రిగా వుండను. ఈనాడే మచిలీపట్టణములో మాయమ్మగారి కడకు తీసుకపోవాలి. ఎంతకాలం ఈగుంటూరులో వుంచేదీ!

మాధ—రామం!

ఉ. సీతను తల్లిదండ్రులతి ♦ చిన్నతనంబున వీడినారు నా
చేతులమీద పెంచి దరిఁ ♦ జేరిచి నీతులనేర్పి నేడు నీ
చేతుల కందజేసితిని ♦ చేడియభారము తీరిపోయె యీ
తాతకు హాయిగల్గు నికఁ ♦ తక్కిన చింతలు నాకు, లేవికన్.

రామం—మరలమరల వెనుకటి వొప్పగింత లెందుకు తాతయ్యా!

మాధ—రామం! మాసీత కడు అమాయకురాలు.

తే. నీలముగనున్న వన్నియుఁ ♦ నీరమనియు
తెల్లనివి పాలటంచనిఁ ♦ తెలిసికొనెడి
అతిచుమాయకురాలు నీ ♦ తమ్మగనుక
ఇంతగా చెప్పుచుంటి నే ♦ నిన్నిసార్లు.

రామం—అఘాయిత్యేరాలు కాదుగా.

మాధ—భూదేవత కున్నంతవోర్పూ, సముద్రునకున్నంత విశాలహృదయం. అగ్నికున్నంత పవిత్రత. మావరహాలతల్లికి, మాసీతమ్మ తల్లికి సహజంగా సమకూరివున్నవి.

సీత—(క్షీరపానీయ మిరువుర కిచ్చి సీత వినయచుండును)

రామం—సీతా! మీతాతయ్య నుడువుచున్న పలుకులన్నీ యథార్థమేనా. ఐనచో సీతారాముల వనవాసక్లేశములోని ఘట్టములను చదివి అందలిమకరందమును పిండి పింగాణీపాత్రలో నున్న యీక్షీరపానీయముతో మిళితముచేసి చంద్రధ్వజములబోలు నీమంగళకరధ్వజములతో నాకిమ్ము. దేవేంద్రుడు రంభచేతి ద్రాక్షామృతమును గ్రోలినట్లు గ్రోలుతాను. పలుకవేమీ—? మరల మూగనోమును నోమ పూనినావా? సదా యీనోముల తోనూ వ్రతాదులతోనూ బక్కచిక్కి పోతున్నావు. స్వస్తి చెప్పరాదూ—?

సీత—అబ్బా! మీరెప్పుడూ ఇట్టులే కోడిగా లాడుతుండారు. బిడ్డ తండ్రివికాబోతున్నావు. ఇంకనూ బాల్యమేనా?

రామం—మరి మీతాత మహాపతివ్రతవని భడాజు పొగడ్తలు నా ముందు పొగడట మెందులకూ?

సీత—ఎవరిబిడ్డను వారు పొగడుకుంటారు; రేపు మీరో. మీబిడ్డను మీరు పొగడుకొనకుందురేమో చూస్తాగా.

రామం—(కాఫీ గ్రోలుతూ) ఒహ్హోహ్హోహో! అదియూ విషయం. కాఫీలో పంచదారకు బదులు లవణముము కలిపిచ్చిననూ మీ తాత ఎంతరుచిగా నున్న దీకాఫీయని పొగడుతాడు. నాబిడ్డ కూడా నాకిట్టులే యిస్తే నన్నూ పొగడ మంటావా?

మాధవు—రామం! నీవు వొచ్చావనే సంతోషములో మునిగి పుటిక్కిన పంచదారకుబదులు లవణమును కలిపి యుండవచ్చును. లలనలకు లవణముకదా అందుబాటులో నుండునది.

సీత—"ప్రమాదో ధీమతా మపీ" అని యెంతటివారికైనా పొరపాటు గ్రహపాటు లుండకపోవు క్షమించుడు. మరల యిప్పుడు పంచదార కలిపిచ్చెదను.

రామం—కొంతలో కొంతనయమే. ఈకాటిపతివ్రతలు కొందరు భర్తలను వశముచేసికొనుటకు మందులూ మాకులూ కలిపిస్తున్నారులే, అంతపని జరుగలేదు. అదృష్టవంతుడనే అదేమీ అంటే ప్రమాదో ధీమతామపీ" అని అంటారు.

మాధవ—సీతా! మనరాముము గొప్పహాస్యప్రియుడు.

రామం—తమరు నశ్యప్రియులు.

సీత—పైగా గానప్రియులు.

రామం—అంతకంట్టే పైగా నీవు గారెల్రప్రియురాలవు.

సీత—అబ్బా! నన్ను నవ్వించ బోకండీ.

రామం—ఏడిపించ మంటావా? ఔనుగాని ప్రయాణం మాట మరుస్తున్నావా.

సీత—ఎందుకు మరుస్తానూ, సిద్ధముగానే వున్నాను.

మాధ—ఇకముందు యీముసలితాతను మరచిపోతారు కాబోలును—

సీత—తాతయ్యా! మాతాపితృల హృదయాన్ని మీయందే చవిచూడగలిగిన మీ యీమనుమరాలు మిమ్ము మరచిపోగలదా?

మాధ—ఇదివరకువోలె నన్ను నీవు మరచిపోకుండా వుండలేవు సీతా! ఇక మరచిపోక తప్పదు. మరచిపోవలయుననియే నాయాశయం.

సీత—ఆకుపుట్టుక పుట్టి మిమ్మిట్టిదుర్ఘట సంకటసముద్రమున సంక్షోభింప జేయుచుంటిని తాతయ్యా మరితప్పదు.

మాధ—నీకొఱకే జీవించాను. తల్లీ తండ్రి లేని పిల్లవని వాళ్ళంతా కన్నులం చేసుకొని పువ్వులలో పెట్టి పెంచాను. పెద్దదానినిం చేశాను స్త్రీల కర్తవ్యములైన ఉత్తమవిద్యలను గఱపించాను. నీవు సుఖపడగలవని కోరినవరున కొనంగి పాణిగ్రహణమహోత్సవాదికృత్యములనుకూడా నెరవేర్చుకున్నాను. సుఖపడుమను నన్ను నీవు మరచిపోతేనేగాని నీసంసారముపై నీకు భ్రాంతి హెచ్చుగా కలుగకు.

సీత—నాపుట్టింటపేరట నీవుదక్క నా కింకెవ్వరున్నారు తాతయ్యా! అంధరినీ బాపుకొంటిని. (అని అశ్రుల గార్చును)

మాధ—రామం! నీవు సకలగుణాభిరాముడవు మాకు లభించావు. మీకన్నా నాకు మాత్రమెవ్వరున్నారూ నేడో రేపో కాటికి కాళ్ళు చాపుకొనియుంటిని మీదంపతు లిద్దరూ నన్నింత బూడిదచేసి పోకూడదూ?

రామం—అది అసంభవం తాతయ్యా! నీవు సీతను వీడుట కెట్లు తల్లడిల్లి పోతున్నావో నాతల్లి నన్ను వీడి యుండుట కట్లు తల్లడిల్లి పోదా — వలయుచో మీసీతను మీరెంచుచ్చవచ్చినంత కాలము మీసన్నిధానముననే నిలుపుకొనవచ్చును. నేనుమాత్రము మాతృదేవిని వీడియుండజాలను సీతపై నాకున్న ప్రేమ మాతృప్రేమయందు మటుమాయమై పోతున్నది.

సీత—తాతయ్యా! ఎప్పటికైనా వారిసొత్తును కాని మీసొత్తును కాను గదా. ఇక నన్ను కాపాడే బాధ్యతకూడా మీకు తొలగి పోయినది.

మాధ—రామూ! మాసీత పతితోడిదే లోకమని తలంచు మహాపతివ్రత నిన్ను వీడి ఒక్కక్షణకాల ముండగలదా. నీకొఱకై ఎన్ని

నోములు నోచినదో ఎన్నివ్రతములు చేసినదో నీకుమాత్రం తెలియదా.

రామం—మాటవరుస కట్లంటివికాని నిన్ను వీడి నేనుమాత్ర ముండ గలనా సీతా! ఆజాలికన్నుల భాష్పముల జార్చకు.

ఉ. సీతరో నిన్ను హృద్భ్రమయ ♦ సీమలో రత్నసుఖాసనంబుపై
ప్రీతిగ నుంచి నిత్యము న ♦ వీనపునోజ్జ్వమహానురాగసం
భూతసుమాళిచేత హరి ♦ పూర్తిగ నెంతటి పూజసేతునో
ధాతకు నీదు కాళికను ♦ తప్పగ శక్యమె ధాతకాతకున్.

సీత—క్షణములో నవ్విస్తారు. క్షణములో యేడిపిస్తారు. అన్నిటికీ తగి వున్నారు.

మాధ—రామూ! పాటకచ్చేరీలకనీ, పండితసభలకనీ సీతను వీడి పోలేకుమునుకదా?

రామం—నేనుమాత్రం! వసివాడనా తాతయ్యా (అని పేపరు చూచు కొనుచుండ మన్మధుడు పెట్టీబేడతో ప్రవేశించి గుమ్మముకడ నిలచి)

మన్మ—సీతా! సీతా! తాతయ్యా! తాతయ్యా!

సీత—(గుమ్మముకడకేగి) ఎవరువారు?

మన్మ—ఉన్నావా! నేనుకదూ సీతా!

సీత—(ఆనందముతో) మన్మథా! నీవా ఇదే రావడమా! లోనికి రా తాతయ్యగారుకూడా వున్నారు. అబ్బా! ఎన్నినాళ్ళకు చూచి తినోయీ నిన్ను చదువుపూర్తిగానిదే ఈసీతను చూడకూడ దనుకున్నావు కాబోలును.

మన్మ—తాతయ్యా! నమస్కారము.

మాధవు—బాబూ! కుశలముగా చేరుకున్నావుకదా సంతోషం.

రామం—(తనలో) ఈప్రబుద్ధు డెవ్వడూ— (మరల పేపరు చదువును.)

మాధవు—బాబూ! ఇప్పు డెచ్చటనుండీ నీరాక.

మన్మ—చెన్నపురినుంచే తాతయ్యా!

సీత—(లోనికేగి) కాఫీ తెచ్చియిచ్చును.

మాధ—పరీక్ష లై పోయినవా?

మన్మధు—(గో)లంతు ఐపోయినవి తాతయ్యా! పరీక్షలో ను త్తీర్ణుడ నయ్యాను కూడాను.

మాధ—సంతోషము నాయనా! మీ మేనమామగారిని చూచి వొచ్చావా?

మన్మధు—వారిని యింకనూ చూడ పోలేదు. ఎప్పుడు మిమ్మ కన్ను లలో వేసుకుందామాయను యారాటము ముందు నా కిటే దారి చూపించినది తాతయ్యా!

మాధవు—బాబూ! మాపైని యెంత యవ్యాజపే)మోయీ నీకు—?

మన్మధు—ఎవరిసిద్ధహ స్తములవల్ల సీతతో సమానంగా దిక్కులేని యీపరమాణువు నభివృద్ధిలోని కొచ్చెను తాతయ్యా! అట్టి మీపైని పే)మలేని కృతఘ్నుడు కాడు యీమన్మధుడు.

సీత—(విప్పారిన కన్నులతో) తాతయ్యా! మనమన్మధుని వేషభా షలు పూ ర్తిగా మారిపోయాయి సుమా మునుపటిమన్మ మన్మధుడు కాడు. నేడు నవమన్మధుడై పోయాడు.

రామం—(తనలో) ఓహో! సీకంటికి వీ డొక నవమన్మధుడా—?

మన్మధు—తాతయ్యా! మనసీతాయికి మంచిగృహోపకరణములను తెచ్చాను.

మాధ—తెచ్చావా బాబూ! ఏవీ—?

మన్మధు—(పెట్టితీసి) సీతా! ఇదిగో దంతపుబొట్టుపెట్టి, దంతపుదువ్వెన, అద్దం, స్వదేశీ శిల్కుశారీలు, ఇంకా యేమేమి తెమ్మన్నావో

అన్నీ తెచ్చాను. ఇవిగో పుచ్చుకో. ఆనాడు తెమ్మన్నావు కదూ అన్నీ తెచ్చాను. సంతోషమేనా—?

రామం—తాతగారి పొడుం బుజ్జో!

సీత—(వస్తువులను గ్రహిస్తూ) మీ వేళాకోళములను పోనిచ్చారు కాదు.

మాధ—బాబూ! సీత నిమిత్తమై యెంతధనవ్యయము చేసితివోయీ.

మన్మధు—ఈధనవ్యయమే కాదు. అవసరమైనచో నాయీప్రాణ పంచకముల సహితమూ సమర్పించుటకు సిద్ధముగా నున్నాను. వీను తమరు పెంచిన బిడ్డడుకాడా తాతయ్యా?

రామం—(తనలో) నాహృదయగోళమున యేలనో చిన్నతుపాను రేకెత్తుతున్నది. వృద్ధిజెందినా పేదకాపురవుకుటీరమును పునాదులతోనహా యెగర కొట్టదుకదా—?

సీత—మన్మధా! వీ రెవరో నీకు తెలియునా?

మన్మధు—నాకు తెలియదు సీతా! నీవే తెలియజేయాలి.

సీత—నేను పేరు చెప్పకూడదు. తాతగారిని అడిగితే వక్కాణిస్తారు.

రామా—ఎవరి నడిగితే వారే వక్కాణింపాలి (తాతవైపునకు తిరిగి) తాతయ్యా గప్‌చిప్.

సీత—పోనియ్! నేనే వక్కాణిస్తాను. జనకుజుని యల్లారు ముద్దుపెద్ద పుత్రికపేరేమో తెలుసునా—?

మన్మధ—తెలియకేమీ. నీపేరే ఆమెపేరూకూడాను.

సీత—ఆమె పెనిమిటి పేరో—?

మన్మధు—రాముడు.

సీత—ఆపేరే వీరిపేరుకూడాను.

రామం—ఆపేరూ యీపేరూ కలసి ఒకపెద్దకాసులపేరై పోయిం దన్న మాట—?

సీత—ఆమె కాయన యేమి కావలెనో వీరు యీమెకూ కాడా అంతే బాతాఖా.

రామం—అట్లాగే కానుకదా.

మాధవు—పేరుచెప్పాట కేన్నిగంజళ్ళు తీయించావు సీతా!

మన్మథు—ధన్యుడను ధన్యుడను. రామమునుగారా వీరు. నానేత్రములు మలినరహితమై పోయినవి. నాహృదయలతిక వికసించి పోయి నది. తాతయ్యా! వీరి వివాహానికి కడను పునస్సంధానమహో త్సవమునకైననూ రాజాలకపోయితినే శ్రీసీతారామచంద్రుల దివ్యమంగళస్వరూపముల చూచి యానందింప లేకపోయితినే యనుకొంటున్న యింత యీనాటితో తీరిపోయినది. నాగాథకూడా విం టారా నేను తిరిస్తాను.

మాధవు—బాబూ! చెప్పుల్లో కాళ్ళు పెట్టుకొని ప్రయాణసంసిద్ధులై వున్నారు.

మన్మథు—రామం! నిజమా! ఈనాడే పయనమై పోవాలెనా?

రామం—అథవా సీతవున్ననూ నేనుమాత్రి ముండుటకు వీలులేదు. నాకు లక్షపను లుండును.

మన్మథు—రామం! మీరిరువురూ నాకోరకై మరిరెండునాళ్ళుండి పోగూడదమా? తృప్తితీరగా నాగాథ విన్నవించుకొని పరితృ ప్తుడ నౌతాగా—

రామం—వీలు లేదు ఇప్పటికే మధ్యమధ్య మకామములు వేస్తూ వృథా కాలయాపనచేస్తూ వొచ్చాను.

పోష్టుజమాను ప్రవేసించి—అయ్యగారూ...?

రామం—ఎవరువారు. ఓహో పోష్టుజమాను కాళింగారా.

పో—ఔను బాబూ!

రామం—ఎవరికైనా జాబు లున్నవా?

పో—మీకే జాబువొచ్చింది సార్.

రామం—సరియే తెమ్ము.

పో—చిత్తం. (అని యిచ్చును.)

రామం—(పుచ్చుకొంటూ) ఖాసీం! మదరాసులోవున్న పోష్టుజమాను గారిని చూస్తే నిన్ను చూడ నక్కర్లేదు మూమూమూర్తులా నీవలెనే వుంటాడు నీకేమన్నా కావాలెనా?

పో—ఔను మహారాజ్! వాడూ నేనూ ఏకగర్భజనితులమే.

రామం—సంశయం తీరింది.

పో—శలవుసార్.

రామం—మంచిది పోయిరమ్మ.

(పోష్టుజమాను నిష్క్రమించును రామం జాబు చూచుకొను చుండ)

సీత—జాబు యెక్కడనుంచి వొచ్చిందండీ?

రామం—చెన్నపురినుంచి.

సీత—ఎవరు వ్రాశారో తెలుసుకోవచ్చా?

రామం—అభ్యంతరం లేదు. రాజ్యం వ్రాసింది.

సీత—(చకితురాలై) రాజ్య మెవరూ?

రామం—దేశీయో గాయకురాలు. ఉత్తమవంశసంజనిత, అవివాహిత, చిరకాలమునుంచీ చెన్నపురిలో నాతో కలసి గానవిద్య నభ్య సింపుచున్నది. చనిపోయిన నాపితృవరు ప్రియమిత్రుడైన డాక్ట రు నారాయణరావుగారి సుపుత్రిక—

సీత—మరచేపోయా! తప్పరి ఛాయాపటమును చిత్రించి బహుమతిగా యిచ్చిన ధన్యురాలు ఆమేకదూ?

రామం—ఔనౌను. ఆమే.

సీత—ఏమి వ్రాసినదో మే మెల్లరమూ వినవచ్చా!

రామం—నిరభ్యంతరంగా వినవచ్చు, వినండి ...

చ. మునలను మించి పాడగల ♦ మానవమాత్రులు లేరటంచు యీ
దినమున వందితోత్రములు ♦ దివ్యముగా సభ సల్ప రండటం
చనగను నవ్వ్మతించితిని ♦ యిచ్చట ఘట్టము లెన్ని యుద్దినక్
మనవిని తోసి పుచ్చకను ♦ మంగళవారము కైన రమ్మికన్.

ఇట్లు రేడియోగాయకురాలు, కపితిలక రాజ్యం—

సీత—(తనలో) హృదయగోళమున యనుమానపెనుగాలి వీచుచున్నది తుదకు గాలివానమై అనురాగపుష్పరాగపిటకలతో కట్టుకొని యున్న మదీయదివ్యభవనమును మిఁగిపోవదుకదా.

మన్మ—రాముఁ! నీవు రేడియో గానకుడవుకూడానా యేమి?

రామం—ఔను ... అన్నిట్లో నున్నాను.

సీత—ఆమె అవివాహితకదా! మీతో స్వేచ్ఛగా విహరింపుచుండ ఆమెతల్లిదండ్రులు మిన్నకుండిరా?

రామం—ఆమె నాగరికురాలు. ఆమె తలిదండ్రులూ నాగరికులే అందు వల్ల సంశయింపరు.

మాధవు—రామూ! రేపోమాపో.

తే. పుత్రవంతుడవో పూర్వ ♦ పుణ్యమునను
పుత్రికావంతుడవో యగు ♦ పుణ్యదినము
లింకరానుండ యింతలో ♦ యిట్లు నీవు
పరుగులెత్తుట తగునె వో ♦ పద్మనయన.

రామం—నాకుమాత్రం తెలియదా తాతయ్యా! శలవు. నే నీబండికే పయనమై పోవలయును. సీతా! నాదుస్తులను సర్దిపెట్టుము. వలదు వలదు నాదుస్తులు కొన్ని యిచ్చట కలవు.

సీత—నేనుమాత్ర మిచ్చటెందులకూ—? నేనూ మీతో వస్తా ...

రామం—సీతా! నీ విప్పుడు రావలదు. రాతగవు. శరీరరొాప్తే కాకుండా మిక్కిలి ధనవ్రయముకూడా.

సీత—ఇక మిమ్ము విడనాడి ఒక్క త్రుటికాలమైననూ నిలువలేను.

రామం—నిన్ను విడనాడి నేనుమాత్ర మిచ్చట దీర్ఘకాల ముండగలనా
ప్రస్తుతము నీవు వచ్చుట సమంజసము కాదని చెప్పుచుంటిని.

సీత—నేను అమాయకురాలనుగాను మాయ చేయుటకు.

రామం—నేను గాయకుడనుగాని మాయకుడనుగాను మాయ జేయుటకు. నామాట వినుము.

సీత—మీమాటలు అక్షరాలా వింటాను. కాని నామనవికూడావినండి.

సీ. విభులను విడనాడ ♦ శుభముగాదని రామ
విభునితో భూపుత్రి ♦ వెడలలేదె
పతులను విడనాడ ♦ పసుప్పుగాదని పంచ
పాండవుల యర్ధాంగి ♦ పరువు లిడదె
మగనిని విడనాడ ♦ మగువకు తగదని
చంద్రముఖి పతితో ♦ చనగలేదె
నాధుని విడనాడ ♦ న్యాయంబుగాదని
దమయంతి నలునితో ♦ తరలలేదె.

తే. ఎందఱెందరో కులసతు ♦ లేగినట్టి
పధము వెంటనె నేనును ♦ పయనమగుదు
వచ్చుదానను నోనాధ! యిచ్చదీర్పు
వల్లతో గంప మెండగా ♦ జలదెజగతి ?

రామం—సీతా! నామాటవినుము. అదిగో పొగబండి వొచ్చువేళ యైనది. పోయివొస్తా తాతయ్యా! శలవు. మన్మధా మరల కలసికొంటా. సీతా! విచారింపకు! అదిగో అత్తులనే గిలకల భావిలోనుండి అప్పుడేట్టుక నీళ్ళుతోడి పోస్తున్నావు. వలదు సుమా—పోయివస్తా. (అంజరూ నిర్జీవప్రతిమలవలె నిలచిపోవుదురు. అశ్రువుల నిరోధముచే చాలా దూరమువరకూ చూడజాలక గాలిలోని దీపములాగు కదలిపోవుచుండ.)

తెర వ్రాలును.

## తృతీయరంగం.

---

(చెన్నపురి—భైరవశాస్త్రి—పూజామందిరం)

అనుబంధం.

లింగా నీదరిశన మెప్పుడుచిక్కు—
లింగా నీదరిశన మెన్నడుగలుగు
లింగా నీదరిశన మెట్టులదొరకు
వెండికొండామీద నల్లగుండూలాగుండే
లింగా నీదరిశన మెవరికిచిక్కు— ॥లిం॥

లింగా నిన్నుగుఱించి ఉగ్రతపస్సుతల్లక్రిందుగా చేయుచున్న భవదీయకింకరుడైన భైరవశాస్త్రికి దరిశన మీయవా పాపభయంకరా!

పోష్టుజవాను ప్రవేసించి చూచి. నావేరు పకీర్రైతే ఈయన శంకరా ఘింకరాయని హూంకరిస్తాడెందుకూ. ఇంకా యేమంటాడో ఈ పక్కనేవుండి అంతా వింటాను.

భైరవుడు—హిరణ్యాక్ష్య హిరణ్యాకశిపులకన్న హీనుడనా యీశ్వరా?

పో—తూత్! హిరణ్యాక్షు హిరణ్యాకశిపుడ నంటాడేమిటీ — ఆశంఖ పూదటమెందుకూ. ఆజాగంట కొట్టటమెందుకూ. ఇప్పటికే ఇతర్లకొంపలు తీసింది చాలక ఇంకా తీయాలినని శ్వామాలి.

భైరవు—సాంబశివా! నాదావాలన్నీ గెలిపిస్తే నీకు భోగాలుచేయిస్తా.

పో—అచ్ఛా! అచ్ఛా! నాకు అంతా అర్ధమైపోయినది. వీడి వృత్తిలో ఇన్నిదురుద్దేశాలుంటే దేశం యెట్లా సుభిక్షంగా వుంటుందీ—

భైరవు—లక్షాధికారుల నందరినీ భిక్షాధికారులుగా జేసి ఇంకా ఒక కోటి లక్షలు నాకు భిక్షపెడితే నీకు లక్షభక్ష్యాలు చేయిస్తా. ఉన్నవాడన నీ నున్నగా నున్నాననీ యేడ్స్తే బిక్కమొగవు బక్క వెధవాయలను ఇంకా యెంతయేడిపిస్తే నేను అంతసంతోషిస్తాఁడోయి నాగభూషణా!

పో—ఎంత సేవటికీ లోకుల కొంపలార్పాలనియేగా యీన కొంగజపాలు. కానియ్యి! కానియ్యి ఈ వేళకు యీవుత్తరాలు యింట్లోవున్న ఆడంగుల కిచ్చిపోయి ఆపైపీడికి బుద్ధివచ్చే మార్గమాలోచించు కుంటా (అని నిష్క్రమించును)

భైర—హరోమ్! హరహర మహాదేవా (అనుచుండ) తెరవాలును.

## చతుర్థ రంగం.

---

(చెన్నపురిలో రేడియోగానానంతరం ఇంటికొచ్చి రాజ్యం సాయంసమయమున డాబాపిట్టగోడ లేక ప్రహారీపిట్టగోడపై కూర్చొని చంద్రుని కేసి చూస్తు)

అనుబంధం.

చుక్కలరథములో
ఎక్కి చక్కంగాను
దిక్కులన్నియు చూచియీ
ప్రక్కకే వచ్చితివ చందురూడావీవు
చిక్కకుంటివియేలో చందురూడా ॥చు॥

పువ్వు పెదనయ్యొయ్యొ
పులకరింపగ జేసి
ప్రాభృతీగెంతోడ
ప్రాణోణ్ణి బందెగా
చేయబూసితివేమి చందురూడావీవు
చిక్కకుంటివియేలో చందురూడా ॥చం॥
మన్మనో చంద్రుండు
నన్నేలు యింద్రుండు
నా రామచంద్రుండు
అమృత గుణసాంద్రుండు
అరుగుదెంచెడిదాక చందురూడా నన్ను
అలయింపజేయకోయ్ చందురూడా ॥చం॥

ఆహా రామమ్మ యీ నా డెంత యమోఘముగా పాడినాడూ! కేవలము తుంబురుడో లేక నారదుడో యీ యవతారమెత్తి నాడుకాని సామాన్యమానవుడు కాడని తోచుచున్నది. ఏలనో యీనాడు నాలో క్రొత్తవింత యవ్వనరేఖ లెన్నెన్నో తొలకరించి వొళ్ళంతా జల్దరింప చేస్తున్నవి. ఇన్నాళ్ళటిలాగా కాకుండా రామాన్ని యింకోవిధంగా వాడుకోవాలిననికూడా పూరట లూగిస్తున్నది. సమంజసమే నా_

సీ. మత్తకోకిలలార ♦ మా ప్రేమబీజంబు
వర్ధిల్లగీతికల్ ♦ పాడరాదె
శుకమహాంగనలార ♦ శుభమంగళంబని
దీవించి మాచెంత ♦ తిరుగరాదె
మధుపంబులార మా ♦ మనసులు రంజింప
ఝేతుమంచనిగోల ♦ చేయరాదె

మలయమారుతుఁడ నీ ♦ మధురడోలికలలో
దేలింతువనిమాట ♦ తెలుపరాదె

తే. తళ్కుతళ్కని మెరయువో ♦ తారలార!
మ్రొక్కుచున్నాను నా కోర్కె ♦ చక్కఁగాను
సెగ్గుసంచని కల్కిను ♦ నేర్పిమీరు
నూనవర్షామృతము జిల్కు ♦ చూడరాదె.

రామం—(ప్రవేసించి చూచి) బహుధప్రసూనములమధ్య ప్రకృతికాంతయో యన నెంత బాగుగా ప్రకాశిస్తున్న దీబంగారుబొమ్మ ఆహా!

సీ. అధరసముద్భూత ♦ హాసాంకురంబులు
కెంపులమోవితో ♦ సంప్రదింప
అడుగిడినపుడెల్ల ♦ కడువడి లోలకుల్
కులుకుచు చెవులతో ♦ కూడియాడ
పయిడంచు చేనేత ♦ పట్టుచీరెచెఱంగు
పాదపద్మములతో ♦ పాటునాడ
ఆరియారని యూ ♦ యార్ద్రసిలాలతో
సంపెంగపూవులు ♦ సరసమాడ

తే. చైత్రమాసంపు మహాలక్ష్మి ♦ ఛాయయనఁగ
నేఁడు విస్తారగంభీర ♦ నేత్రియగుచు
పూలమొక్కల నడిమధ్య ♦ పుష్పగంధి
యేలుచున్నది యవ్వన ♦ శీలపురిని.

రాజ్యం—చంద్రా! నీవైన నా రామచంద్రునకు చెప్పకూడదూ?

రామం—రాజ్యం! రాజ్యం!

రాజ్యం—(చూచి) వచ్చావా రామా! చంద్రునికొఱకై నిరీక్షించు చకోరమువలెనే నీకొరకే నిరీక్షిస్తున్నా! దయచెయ్యి!

రామం—చీకటిని చించుకొని శీఘ్రముగా చనుదెంచుచున్న యామచంద్రుని మాడ్కి ఈరామచంద్రుడుకూడా అజ్ఞానాంధకారాన్ని పోద్రోలచేయుడాని కోస్తున్నాడు.

రాజ్యం—నేడింత ఆలశ్యమైన దేమిరామూ!

రామం—మిత్రులతో మాట్లాడి వచ్చుటచే కొలదివ్యవధియైయుండ వచ్చును.

రాజ్యం—అలా నిల్చి యుంటివేమి. రామూ ఈపిట్టగోడపై కూర్చొని స్తిమితముగా మాటలాడుదము.

రామం—రాజ్యం! వచ్చపువ్వువలె చంద్రకాంతి నయనానంద మొనర్చుచుండెనుసుమా!

రాజ్యం—ఔనౌను! అప్పుడప్పుడు ఆ లేతమబ్బులు చందురుని కౌగలించుకోడానికి స్వాగత మిస్తున్నాయి.

రామం—హరి! హరి! దూరమునుండి మేఘపంక్తి చందురుని ముంచుటకు మహావేగముగా పరుగు లెత్తుచున్నది.

రాజ్యం—శివ! శివ! ఆ మేఘపదవి తాకుడునకు చందురుడు చలించిపోవడుకదా.

రామం—చందురుడు తక్కువబంటా! ఎన్ని డక్కాముక్కీలు తిన్నాడో చూడూ వాటిని లయింపచేసుకొన తనస్వేతకాంతి పుంజముల ద్విగుణీకృతముగా విజృంభింప జేయుచున్నాడు.

రాజ్యం—ఇట్టిసమయమున నే మనపువ్వుటెదలలో దాగియున్న పువ్వుల హారతిపాటను చంద్రునకు వినిపింతామూ.

రామం—ఔను. ఇట్టిమధురసాయాహ్నమందే పువ్వులహారతివ్వాలి.

రాజ్యం—బిల్హణ యామినీపూర్ణతిలకలుకూడా యిట్టియమృతఘడియలల్లోనే సుధాకరునకు సుభహారతుల యిచ్చారుట.

రామం—ఏదీ నీవు రచించుకొనుచున్న గీతికను ఆచందురునకూ ఈ రామచందురునకుకూడా వినిపించూ వింటాము.

రాజ్యం—ఓవ్ పాడతాను రతీదేవిలాగు పాడతాను. మన్మధునిలాగా వింటానంటే.

రాజ్యం—సరస్వతి పాడుతుంటే బ్రహ్మమైనవాడు వింటున్నట్లు వింటాను.

చుక్కల రథములో
ఎక్కి చక్కంగాను
దిక్కులన్నియు చూచియా
పక్కకే వచ్చితివె చందురూడా నీవు
చిక్కకుంటివియేలొ చెందురూడా.
దుర్వాసనసముద్రంబు
దవ్వుదవ్వున కొచ్చి
కెవ్వుకెవ్వున నేడ్చు
వువ్వుబోడిసిగ్గుమింగ
రివ్వుమని వొస్తుంటె చందురూడాపైన
నవ్వుతూ చూతువా చందురూడా ॥చు॥

రామం—(స్తబ్ధహృదయుడై కూర్చొనియుండు)

రాజ్యం—రామం! అలా స్తబ్ధహృదయుడవై పోయావేమీ—?

రామం—ఏమీ లేదు. గృహసామ్రాజ్యపట్టభద్రుండుడైన యీరామ భద్రునకొరకు మంత్రిని యెదురు చూచుచుండును. నేను పోవాలి. (అని లేచును)

రాజ్యం—రామం! నీమాటలు నా కర్ధ మగుట లేదు. అసలువిషయ మేమో నాకు విపులముగా చెప్పకూడదా?

రామం—రాజ్యం! నేనొచ్చి చాలదినము లైపోయినవి. ఇక నిలచుటకు నాకు వ్యవధి లేదు. వెడలుట కనుజ్ఞ యిమ్ము.

రాజ్యం—ఈగృహంబున ఏ నొంటరిగా గబ్బిలాల కొప్పగించి పోయెదవా రామం.

ఉ. ఏగతి నీవు లేక క్షణ ♦ మేగుదు యీమదరాసుపురిన నే
నేగతి నేర్చుగా తమరు ♦ నేర్పిన యీవర్ణయార్ద్రగీతికల్
బాగుగ వీణతో గలపి ♦ పాడగ నేర్తును భావ మొప్ప నీ
వేగతి జూపి నా కికను ♦ యేగదలంచితో తెల్పరాసఖా!

రామం—రాజ్యం!

చ. మనుపటివోలె నే నిపుడు ♦ నిటుచ్చటగా యుచటుండ చెల్లదో
వనరుహనేత్రి! నాకొలువు ♦ వారముర్రోజులయుండి యెంతయో
వెతుదిగులొందుచూ రచట ♦ పెద్దలు వుంచిరి యేమిసేతు, నా
మనవిని యాలకించు యను ♦ మానముఁ లేకను పంపు మిత్తరిన్.

రాజ్యం—రామం! నిజంగా పోవాలిసిందేనా?

రామం—నిజం రాజ్యం! నాకొలువు క్షణ మొకయుగంబుగా తలంచి వాపోవువారు కలరు.

రాజ్యం—మరల మనయిరువురిసమాగమ మెప్పుడూ!

రామం—మరి రెండు నెలలకు రేడియో పాటకచ్చేరీ నిర్ణయింపబడినది. గనుక అప్పటికి రాకతప్పదు.

రాజ్యం—రెండు నెలలకా! అబ్బా! ఎంత దీర్ఘ కాలమూ. అంత దీర్ఘ కాలము ఏకాంతముగా నే నుండగలనా రామం! నీయుండ చూచికదా మావాండ్రు ఈచెన్న రాజధానిలో నిలువనుంచిరి. అదిగాక రామూ—

తే. గాయికీగాయకులము ధర ♦ కలసి తిరుగ
మానసిక చింత లన్నియు ♦ మాసిపోయి
సతము గానసుధాప్లుత ♦ సరసిలోన
స్నానమాడుచు రనిగదా ♦ సరసు లనుట.

కావున నేనుకూడ మీతో వస్తాను.

రామం—తప్పు రా తగదు.

రాజ్యం—ఎందువల్లా?

రామం—నీవు స్త్రీవి. నేను పురుషుడను.

రాజ్యం—స్త్రీ పురుషునివెంట రా తగదా?

రామం—పరపురుషునితో రాకూడదు.

రాజ్యం—పరపురుషుడు కానిదే తనపురుషు డెట్లగును?

రామం—వివాహమువల్ల.

రాజ్యం—పరపురుషుడను కానని చెప్పను నేనుకూడా పరస్త్రీని కానని చెప్పుకొందును.

రామం—హరి! హరీ! అది నాకు పాపంకాదా రాజ్యం.

రాజ్యం—శివ! శివ! ఇందు పాపమేమున్నది. ఒకస్త్రీ ఒకపురుషునకు సర్వస్వం వొప్పగించుట పాపమా.

రామం—రాజ్యం! ఇట్టిమాటలు ఎన్నడైన ఉచ్చరించితివా?

రాజ్యం—ఇదివరకున్న స్థితిలో యిప్పుడుంటినా రామం.

రామం—ప్రేమ కిన్నిమార్పు లెందుకో తెలుసుకున్నానని చెప్పితే చాలగా దాని కిడొంకతిరుగు డంతా యెందుకూ.

రాజ్యం—ప్రేమ కిన్నిమార్పు లెందుకో యనుభవమువల్లనే తెలిసికొంటిని. నీవుకూడా నావలెనే తెలిసికొనే వుంటావుగా. ఇక ప్రేమించుకొంటే మాత్రం తప్పేమున్నదీ—

రామం—తెలిసికొనగలుగుదును మరియొకవిధముగా—

రాజ్యం—ఇప్పుడు నేనునూ మరియొకవిధముగనే ప్రేమించుచుంటిని.

రామం—ఇది తాత్కాలికప్రకృతిలో దేశ జనితభావ విప్లవాలత కాని చోసి నేమీ నన్ను నీరీతి ప్రేమించుటేమి. నీహృదయమును నే నెఱుంగనా.

రాజ్యం—రామం! నామనస్సు బోడివోయినది నాఅంతర్వాణి నీ శరీరస్పర్శ కావలయుననీ నిన్ను విడనాడయుండ లేనని బలవంతము చేయుచున్నది కావున నీహృదయాకాశములో పువ్వుల విమానముపై తనివితీర నన్ను స్వేచ్ఛగా తిరుగనిమ్ము.

రామం—వీలు లేదు యిదివరకే ఒక అంగనామణి కంకితమై పోయింది.

రాజ్యం—యుధార్థమా?

రామం—ముమ్మాటికినీ యధార్థమే.

రాజ్యం—ఐతే కావచ్చు. అందుల్లో కొంచెం తావీయండి యీఅంగనామణికికూడా.

రామం—నాతల్లి పతివ్రత. నాతండ్రి యేకపత్నీవ్రతుడు. నాదీ యేకపత్నీవ్రతమే కనుక నీహృదయాన్ని మరల్చుకో. నాలో తావు లేదు.

రాజ్యం—రామం! చాలా ఆశ్చర్యంగా నున్నవి నీమాటలు పైగా కవివైనావు కవు నీకు నేను చెప్పాలా! నీకు తెలియదా?

సీ. ధరణి పాలించిన ♦ దశరధమహారాజు
ఏకపత్నీవ్రతం ♦ బేల విడిచె?
గోపాలధనుడైన ♦ గోపాలకృష్ణుడు
ఏకపత్నీవ్రతం ♦ బేల విడిచె
రహిని పాలించిన ♦ రాజరాజనరేంద్రు
డేకపత్నీవ్రతం ♦ బేల విడిచె?
అఖిలధర్మాత్ముల ♦ నర్యయుగల్గిన చంద్రు
డేకపత్నీవ్రతం ♦ బేల విడిచె?

తే. మేటిపిలుకాడు యర్జునుం ♦ డేటి కపుడు
ఏకపత్నీవ్రతపర్మ ♦ మేల గలిపె?

ఇతరులకు చెప్పెదరు కాని • యిట్టిప్రేమను
కాముచేయగ లేరు స్త్రీ • కాసు లగుచు.

రామం—బహుపత్నీవ్రతులమై పలుబాధలు పడుచుంటిమి కాన మ
మ్మందరు మీరు ఏకపత్నీవ్రతులై సుఖింపుటకు యాదర్శమున
కట్టుచేసి యుండవలెను రాజ్యం!

రాజ్యం—అతకనిమాటలు చెప్పి అభినవశాకుంతలనాటకములో నన్నే
ల చిత్రాంగిపాత్రకు వేయుంట నీవేల సారంగధరుడవై పోయె
దవు రామం. దుష్యంతునివేష మేయుము. కథ రక్తి గట్టును.

రామం—రాజ్యం! ఇన్నినాళ్ళనుండియూ లేని యీభౌతికవాంఛ
తాత్కాలికసుఖము సుమీ ఇది లేనందున మన మిరువురమూ
సగౌరవముగా సంచరించితిమి. ఇప్పు డిది కోరితి మేని పలువు
రకు లోకువైపోదుము. కుటుంబ సుఖము నీవు మాహాలోకువై
పోదువు.

రాజ్యం—రామం! నే నేమి చేసేది! ఇదివరకు నీచే గౌరవింపబడితిని.
ఇప్పుడు యౌవ్వనసముద్రములో దిగబడి దరిగానక తల్లడిల్లిపోవు
చుంటిని. ఇదివరకు లేని వ్యామోహాలు ఈయుత్తరక్షణమున
సముద్రమునందు మత్తుంగతరంగములరీతి యావిర్భూత మగు
చున్నవి.

రామం—రాజ్యం! భౌతికవాంఛామృగతృష్ణలోన బడి యుక్తాయుక్త
ముల మరచి పలువరించుచుంటివి. త్వరలో రాగద్వేషక్రోధా
సూయువిషాది మహారోగములకు దివ్యతరమైన ఔషధాన్ని
సేవింపుము తరింపగలవు.

రాజ్యం—రామం! పైత్యరోగికి పరమాన్నం పెట్టినట్లున్నవి నీమాటలు.

ఉ. పెండిలి కాని చిన్నదొక • ప్రేమమహావిరహాగ్నిమధ్యమం
దెందుచు వాడుచున్ కరుణ • యేలుమటంచున బుట్టయువ్వనో

చ్ఛండతరాపరివాహాభర ♦ సాగరమందున త్రోయు నెంచితో
పండితశ్రేష్ఠమా తగునె ♦ పల్కుచు శుష్కవితర్కవాదముల్.

రామం—రాజ్యం!

ఉ. చక్కటిశాస్త్రముల్ చదివి ♦ సర్వ మెఱింగియు స్వల్పకాంక్షలీ
పక్కట కోరగా తగునె ♦ యజ్ఞులరీతి విచార మొందక
తక్కిన చింతలేల విను ♦ తల్లియు తండ్రియు కల్గియుండ నీ
విక్కడ యిట్టిచేష్టలకు ♦ యింపు ఘటింపగ తప్పు కాదొకో.

రాజ్యం—రామం! నాతల్లిదండ్రులు నాకు సర్వస్వతంత్ర మిచ్చి స్వేచ్ఛాజీవిని చేశారు. నాతనుమనఃప్రాణములపై హక్కు నాయధీనములోనే నున్నది.

రామం—అదియే వారు చేసిన తప్పు.

రాజ్యం—అదియే వారు చేసిన యొప్పు.

రామం—హరి! హరీ! ఎంతపాపకాలము సంభవించినది.

రాజ్యం—భళి! భళీ! ఎంత పుణ్యకాలము సమీపిస్తున్నదీ.

రామం—రాజ్యం!

రాజ్యం—ఏమి రామం!

రామం—చూడూ.

చ. ఇదివఱ కెన్న డేనియును ♦ యిట్టుల నీ స్థితి యెఱుగనటంచు నా
యెద తలపోయుచుంటి జుమి ♦ యెంతయు మోనము దాల్చి నేడు నీ
యుదగు విషాదమాపనికి ♦ యాతనమార్గము త్రొక్కుటెట్లు నీ
హృదయము మారుటెట్లు జన ♦ హృద్యముగానిది చేయుటెట్టులో.

రాజ్యం నీవు అరణ్యమధ్యమందున్న దేవపరిమానమని నా యెద స్మరించితినేగాని బహువిధపుష్పములమధ్య పరిమళ సూన్య సౌరభయుక్తమైన పచ్చపుష్పమని గ్రహించుకొలేక పోయాను.

రాజ్యం—రామం! పొంగుచున్న యీ వ్యామోహసముద్రానికి సేతువును కట్టించగల రామచంద్రుడవని తలంచితినిగాని స్వార్థపారాయణుడైన యీ రావణునితో పోల్చగింప నెంచిన విశ్వాసహీనుడవని తలంపలేకపోయాను—రామం!

ఉ. మోహసముద్రమధ్యమున ♦ మోహనగాత్రిని త్రోసి పోవగా
ద్రోహము కాదె జీవసఖ ♦ దోసిలి యొగ్గెద భిక్ష పెట్టుమీ
దేహము నిల్వబోదు నిక ♦ దేల్పుమి యేగగ న్యాయమా నన
న్నాహుతి జేసి పోయి కడు ♦ హాయిగ నుందువె రామచంద్రమా.

రామం—అంధురాలకు బుద్ధి మించ్చి చూచుకోమన్నట్లు నా మానసిక ప్రేమతత్వప్రబోధము గాఢానురాగ దోదూయమాన హృదయురాలవగు నీకు రుచింప జాలదు కనుక నన్ను పోనిమ్ము.

రాజ్యం- వీడజాలను.

రామం—ఏమి చేస్తావు.

రాజ్యం—అస్మదీయమృణాల సన్నిభ బాహుద్వయముచే నీకంఠము బిగించి ముఖాన్ని ముద్దులచే కడిగేస్తాను.

రామం—మంచిపనే చేస్తావు.

రాజ్యం—మోవి తేనియలు జుర్రేస్తా కూడాను. (అని సమీపించి) హాయ్! హాయ్! నీస్పర్శాసుఖ మెంత హాయి చేకూర్చిందీ...?

రామం—ఐనదా! నీకోర్కె తీరిందా! దీనినే పశుతత్వ మంటారు.

రాజ్యం—కాదు దీనినే మానవసహజమైన కృత్యమని తారాశశాంకులు ఉద్ఘాటించారు.

(పోస్టుబవాను ప్రవేశించి) బాబయ్యా! బాబయ్యా!

రామం—ఎవరువారు. పోష్టుబవానా?

పో—ఔను బాబూ! మీకు తంతి వొచ్చింది సంతకం చేసి తీసుకోండి.

రాజ్యం—వినాయకుని పెండ్లికి వేయి విఘ్నాలన్నట్లు ఈతద్దినముకూడా యిప్పుడే రావాలీ.

జమా—(ఇచ్చి నిష్క్రమించును.)

రామం—కొంప మునిగిందీ.

రాజ్యం—కొంప మునిగితే ఘట్టికొంప నాయీ కొంప వున్నదిగా.

రామం—ఇం కేమున్నది.

రాజ్యం—రామం! ఏమున్నదీ! అంత గాభరా పడుతున్నావు.

రామం—నాతల్లికి చాలా జబ్బుగా వున్నది. సీతను తీసుకొని ఈ వెంటనే రమ్మనమని వున్నది.

రాజ్యం—రామం! సీత యెవరూ?

రామం—అబ్బా! నన్నిప్పుడేమియూ నడుగకు నాకు మతి పోయినది. నే నిప్పుడే పోవాలి.

రాజ్యం—నాకుమాత్రం మతి పోకుండా వున్నదా. కావున మతులు పోగొట్టుకొన్న మనయిరువుర మేకమై పోయినచో అశోవహాతు లము కాకుండా వుంటాము.

రామం—వలదు! వలదు.

రాజ్యం—పోవలదు! పోవలదు.

రామం—న న్నాపకు. (అననూ ఆగక తోసివేసి రామము నిష్క్రమించును. రాజ్యాం నేలపై బడి లేస్తూ)—

రాజ్యం—రామం! ఎంతమోసం చేసి పోతున్నావూ.

ఉ. ఈనవజాజిపూపు వ ♦ రింపక యెట్టుల వీడువా డటం
చే నిట యోజ చేసితిని ♦ యెన్నో తలంచితి శుద్ధమొద్దుతో
కానక సంచరించితిని ♦ కాళ్ళకు వేళ్ళకు మొక్కి మ్రొక్కితి
హీనత జూచి యేగె గుణ ♦ హీనుడు రాముడు క్రూరు డయ్యొనే.

(కొంటెకొంటె చంద్రునికేసి చూస్తూ)

చుక్కల రథములో
యెక్కి చక్కంగాను
దిక్కులన్ని చూచి యీ
ప్రక్కనే వచ్చితివె చందురూడా నీవు
చిక్కకుంటివియేలా చందురూడా ॥చు॥
సూర్యగ్రహణమున నేను
సుష్కించి పోతుంటె
శుద్ధపౌర్ణమినాడు
శుంత సేపా లేసి
చూచి పోవచ్చితివె చందురూడా నీకు
చులకనై పోయితినె చందురూడా ॥చు॥

తెర వ్రాలును.

## పంచమ రంగం

---

భైరవశాస్త్రి పూజామందిరం.

లింగా నీధ్యానమ్మె మెంతో సౌఖ్యం
నీసేవ లెంతో మోక్షం
నీశూల మెంతో స్థానం
నీకాయ మెంతో వజ్రం ॥లి॥
వన్నెలువంతు నీది
పూజించు వంతు నాది
నైవేద్య మంతా నీది
తింటాన్కి వంతు నాది ॥లిం॥

కాలభైరవా ఈభైరవశాస్త్రిపై నీకృపాకటాక్షవీక్షణాలను బలిపి
ఇంకా నన్ను బలిపించి, కులికించి, పులకించి, పులిపించి ఏగోయే
టట్లు చేయవా విశ్వనాథా! ఛీ! ఛీ! నిజముగా నీవు యీశునవు
కావు పాపకోశునవు. అతిశూలం నీకెందుకూ నాకిచ్చి
పారెయ్యి, ధనకుడననీ సనాతనమత్తగజేంద్రతుల్యుడననీ
యేస్పిపోయే యీవరదద్దమ్మ పెద్దమ్మ పుత్రులను ధ్వంసం
చేసి నీకు ధ్వజారోహణమహోత్సవం జంగ్యాయమృతిను గా
కానసాగిస్తా.

పోష్టుమేన్—లింగాకారంముతో (వ్రేసింది) ముండావాడు కండ్లు
మూసుకొని ఎంత బాగా హూంకరిస్తున్నాడూ వీడిభరతం
పడతాను.

భైరవ—నీయొక్క వేమిటో చెప్పు స్వామీ! నీకు త్రిశూలంవుంటే
నాకు కడవుశూలం వున్నది. నీకు త్రినేత్రాలుంటే నాకుచత్వా
రవుజోడుతో సహా నాలుగు నేత్రాలున్నవి. నీకు పుట్టవుంటే
నాకు సర్వాబ్బుజ్జవున్నది. నీవు బొజ్జవుంటే నాకు గుజ్జువున్నది.
నీకు కొండవుంటే నాకు గోడ అండ వున్నది. నీకు శక్తివుంటే
నాకు యుక్తి వున్నది. నీకు గంగవుంటే నాకు మంగి వున్నది.
నీకు పాములుంటే నాకు దోమ లున్నవి. నీయొక్క వేమిటో
నాకొక్కటియూతో చూటలేదు. నిజముగా నీవు స్వామివైతే
వదో ఒకరూపమున ఇక్కడ తక్షణం ప్రత్యక్షమవి లక్షవరా
లిచ్చి నేనిచ్చినన్ని భక్ష్యాలు పుచ్చుకోని పోవోయ్ లింగా లింగ
లింగ లింగ మహాలింగా.

పోష్టు—బిడ్డా! లింగడు సాక్షాత్కరించాడు చూడు.

భైరవు—లింగనిరూపముతోనున్న పోష్టుమానుని చూచి హా లింగా!
లింగ లింగ మహాలింగా నీనిజస్వరూపమును నాకు చూపితివా.

పోష్టు—భైరవా! నీభక్తికి మెచ్చితిని. హరి బ్రహ్మేంద్రాదులకు కూడా దుర్లభమైన నాసుజ్యోతిరూపమును నీకు చూపుచుంటిని. చూడుము. నీయిష్టము వచ్చినట్లు చూడుము. చూడదలచు కున్నదంతా చూడుము. ఈలింగాన్ని ఎంత చూస్తే అంత మోక్షం చూడు.

భైర—చూస్తున్నా లింగా! ఎంతచూచినా ఆశివి తీరదుగదా మహా లింగా. (పాడుతూ యెగురును)

లింగా నీదరిశన మెవరికి దొరుకు
లింగా నీదరిశన మెట్టుల చిక్కు
లింగా నీదరిశన మెవ్వరికి దక్కు
వెండికొండామీదా కొబ్బరిబొండాంవలె నుం
డులింగా నీదరిశన మెవరికి దొరకూ.

పోష్టు—భైరవా ఈలింగేశ్వరునివల్ల నీకు కావలసినసహాయ మేమిటి.

భైరవ—కోట్లింగా! భక్తత్రాణ పరాయణుడవని ఈభైరవశాస్త్రి కోర్కె వీడేర్చువనీ పిలచితిని.

పోష్టు—సరే మంచిదే. నీకు యేమేమి కావాలో కోరుకో.

భైరవ—దరిద్రబాధకు తట్టుకోలేకుండా వున్నాను.

పోష్టు—తట్టుకోలేకపోతే ఈలింగాన్ని పట్టుకోవటమెందుకురా అంట.

భైర—నాకు ఒకలక్షవరాలిస్తే తట్టుకుంటా లింగా.

పోష్టు—అంతేవరమా లే.

భైర—వరమేలుగాదు. మహాప్రభూ వరాలు.

పోష్టు—ఓహో వరాలు కావాలెనా నీకు.

భైర—ఔనా మహాశివా!

పోష్టు—ఐతే ఒకసందేహ మున్నది.

భైర—శలవియ్ శంకరా శిరసా వహిస్తాను.

పో—నీవద్ద పిశాచపుసొమ్ము న్నదోయ్ మంగలు అది పోవాలె.

భైర—అది యెట్లా పోతుంది స్వామి

పో—దరిద్రులకు ఉచితముగా ఉన్నదంతా యిస్తే పోతుంది.

భైర—ఆప్రకారమే చేస్తాను.

పో—అట్లాగే చేస్తే మారల నీకు ప్రత్యక్షమవడి నీకు లక్షువరాలిమ్మాటే కాకుండా నీయింట కుబేరుణ్ణికూడా సేవకావృత్తి చెయ్యడానికి పంపిస్తా.

భైర—కుబేరునకుకూడా పైకుబేరుడనే తాను కామాలి.

పో—(అదృశ్యుడగును)

భైర—ఆహా ఎంతలో అదృశ్యుడైనాడు లింగడు.

తెర వ్రాలును.





ఓం

శ్రీవీరాంజనేయాయనమః.

# యథార్థము

## ( లేక పతివ్రత )

---

### ద్వితీయాంకము—ప్రథమరంగము.

---

(సీతామన్మథులు కూర్చొనియుండ మధ్య గ్రామఫోను టేబులు పైనుండును.)

**మన్మ**—సీతా!

ఉ. చిన్నతనంబునుంచి నను ♦ చిత్తమునందున తమ్ముడంచు, నీ
కన్నులలోన పెట్టుకొని ♦ కాచుచునుంటివి ప్రేమతోడ, నే
నెన్నడు దీర్తునీ ఋణము ♦ నెట్టులు దీర్తును వృత్తియైన లే
కున్నది యేమిసేతు యిపు డుర్విని యెచ్చట నేగి చూచినన్.

**సీత**—మన్మథా! చింతించకుము. మావారు వచ్చినపిదప నీకు వివాహ ప్రయత్నమే కాకుండా ఉద్యోగప్రయత్నముకూడా చేయుడని వారిని ప్రార్థించుకుంటాను. నీవుకూడా వారితో హెచ్చరింపుము. వారు చాలా సద్గుణస్వభావులు. గాన కళాకోవిదులు. పైగా పలుకుబడి గలవారు. తప్పక కనికరిస్తారుకూడా.

మన్మ——(రికార్డును వేయబోతూ) నీవు సాయంకాలిగల ప్రేమనుకవులు కూడా వర్ణింపలేరుకదా సీతా!

రామం—ద్వారమునకడకొచ్చి ప్రేమ యనుమాట విని ముఖముదెబ్బ తిన్నగొడ్డువలె చకితుడై ప్రక్కనదాగి తనలో వీరిరువురి ప్రవర్తనలూ నాకు అనుమానాస్పదముగా నున్నది.

ఉ. అరమర లేక్క యియ్యబల ♦ యుత్తరులో తలదువ్వి చక్కగా
మరువము కీల్జడన్ జొనిపి ♦ మంచిసుగంధము మేనబూసి, బ
ల్మెఱుమెఱలాడు సొమ్ములను ♦ మేలుగ దాల్చి మదించి కండ్లకా
వరమున వీనితో నగుచు ♦ వాగుచునున్న దదేమి చిత్రమో?

ఐననూ యీ వాతాయనమ్ముల మొగాననుండియే వీరిసంభాషణలను వింటా.

మన్మధు——(ప్లేటును తీస్తూ) సీతా! నాపైని కెంత దయా! ఎంత ప్రేమా. నిక్కముగా ఈప్రేమకు చలన మున్నదికదా.

రామం——వాస్తవముగా వీరిరువురకూ ప్రేమసంబంధ మున్నదియే తీరును.

సీత——మన్మధా! నీవు ప్రేమింతువూ ప్రేమింపబడుదువు, అసలు నీ హృదయమే ప్రేమహృదయము. నిన్ను అర్థం చేసుకోగల వారికి నీ ప్రేమహృదయాన్ని బలిగా సర్పించుకుంటావుకూడా. నీవు ప్రేమించినట్లు భగవంతుడుకూడా ప్రేమింపజాలడు. అట్టి ప్రేమస్వరూపుడవైన నీపై నాకు ప్రేమ లేకుండునా?

రామం——దుర్భరము! దుర్భరము! వినజాల కనజాల. నాహృదయాంబరవీధిలో గాఢమేఘాలు చెడుగుడి యాడుతున్నాయి. అన్నన్నా! యెంతమోసము. అనుకున్నంత తెసది.

ఉ. మాయలమారిదంపు యువతి ♦ మానసము జెందక పూరుషుండు మ
త్ప్రేమను సెప్పుడున్ బ్రతిఘత ♦ ప్రేమనుడి తన్నిల జూచునంచు తా

గోపకులసంఘము గప్పకుల ♦ గొప్పకు స్త్రీప్రపంచము బట్టెదో
యాయమధర్మరాజయిన ♦ యారయు లేనగ శిక్ష వేయగన్.

పుష్పమాలయని మెడలో ధరింప తొడిగెను సర్పమాలయే
యైనది.

సీత—(రికార్డు ఆపగా) ప్రేమ యనగా యెట్టిదో దానిస్వభావ మెట్లుం
డునో దానివల్ల యెంతటి సుఖవంతు లయ్యెదరో నీవలె యా
రాముడుగూడా నిరూపింప చేయలేక పోయాడు. నీవు నిజ
ముగా ప్రేమావతారుడవు మన్మధా!

రాము—ఎంతటిసాహసురాలవు. ఎంతటి స్వామిద్రోహురాలవే.

చ. అతివలు నమ్మరాదు తన ♦ యాత్మను నమ్మిన రాజునైన దు
ర్వ్యతలతొ నొప్పగించెదరు ♦ వాస్తవ మెన్నడు బల్కబోరు న
గ్గతులకు దూరమౌచు నపు ♦ డాలుని కైవసు జంక కిట్టులన్
పతులను మోసపుచ్చెదరు ♦ పాపపుముండలు కొంత ధర్త్రిలో.

ఛీ! దీనిముఖమైననూ చూడరాదు చూడను దీనిని యీమన్మ
ధునకే సమర్పించెదను. అబ్బా! నాగుండెలపై సీత యిప్పు
డొకనిప్పులకుంపటియై పోయింది హా! నాతల తిరిగి దిమ్మెక్క
పోవుచున్నది. ఈకులినావరణములో ఈఅర్ధకులినాంగము
లతో కలువరాదు. ఉండవరాదు. ఛీ! సీతా! యీరాముడును
మన్మధునకు వశమైయున్న నీముఖమైనా చూచునా సద్గతికి
దూరమై పోవుటయేగాక నాకునూ నీవు దూరమై పోయితివి.
పాపిష్టురాలా. నీవీ మన్మధునకే అర్పణము చేయుచున్నాను. రాము
డు నిష్కళంకుడై హాయిగా జీవిస్తాడు.

(క్రోధముతో నిష్క్రమించును.)

మాధ—(అడావుడిగా ప్రవేశించి) సీతా! సీతా!

సీత—ఎందుకు తాతయ్యా!

మాధ—నీభర్త యత్యంత క్రోధాకులమానసుండై నిర్వేక పోతున్నా డేమిటా—?

సీత— (భయముతో) నిజమా తాతయ్యా!

మాధ—నాకు బాజారులో కానుపించి మీయత్తయ్యకు చాలా బలువుగా నున్నదనియు, సీతను అర్జంటుగా తీసుకపోవలెననియు, చెప్పి యింటికొచ్చినాడు. తిరిగి నేను బాజారుపనుల నెరవేర్చుకొని గృహోన్ముఖుడనై వస్తూండగా యెదురుపడ పిలిచినను పలుకక ఆక్రోశముతో చూచి వెళ్లిపోతున్నాడు.

సీత—ఇదంతా నిజమా తాతయ్యా!

మన్మథ—కారణ మేమై యుండును.

సీత—తాతయ్యా!

చ. మనసున నెద్దియో కలత ♦ మాకొనుచుండెను రామచంద్రు డీ
దినమున చేరవచ్చియును ♦ తిన్నగ నన్నిల జూడకుండ తా
వెనుకకు పోయినారు తెర ♦ నేదిక తాతరో యాత్మలోన యు
ద్యోగముప కేమి తోచెనో కో ♦ యాగ్రహ మెందుల కొచ్చెనోకదా.

మాధ—నాకునూ తోచటం లేదు.

మన్మథ—కారణం లేకుండా యెందు కలిగి పోతారూ?

సీత—మన్మథా! నీవు పోయి యెందుండైనా కలసికొని వానికి బతిమి లాడి తీసుకొని రాగలవా — పొమ్ము... ...త్వరగా పోండి. తాతయ్యా నీవుకూడా పోయిరా. అబ్బా! ఇంక ఆలోచిస్తా రెందుకూ. ఆలసింపక పోయి రాండి. నాకన్నులకు వారిని చూపింపకపోతే మీ రింక చూడలేరు నన్ను.

మన్మ—తాతయ్యా పోదాంపద.

మాధ—పోకపోతే యెట్లా పదా.

సీత—(రాముని పఠమును చూస్తు) ప్రభూ!

చ. పతిపదసేవచే పరమ ♦ భాగ్యమటంచని నమ్మికొన్న ని
సతిపయి కోపమేల నను ♦ సారగ చేసిన దోసమేమి మీ
మతి కెటు తోచెనో నగిడి ♦ మంచిచెడ్డయు తెల్పకుండ యీ
స్థితి నను వీడిపోవగను ♦ చిత్తము దెట్టుల యొప్పె నావిభూ!

(తెర వాలును)

## ద్వితీయ రంగము.

---

(రామంతల్లి శాంతమ్మ మరణశయ్యపై నుండ
రామం సేవ చేస్తు)

రామం—అమ్మా! అమ్మా!

శాంతమ్మ—నాయనా! రామూ వచ్చావా బాబూ! ఎంతసేపైనదీ.

రామం—ఒకయామమునకు పైన ఐనదమ్మా! ప్రస్తుతము నీ కెట్లున్న
దమ్మా!

శాం—రామూ! ఇక నేను జీవింపను రా! నా కేమో అగోచరము
గా నున్నది.

రామం—నీవే జీవింపకున్న నేను దుఃఖజీవిని కానా మాతా!

శాంత—రామూ! నాముద్దులకోడలు సీత యేదీ...

రామం—అమ్మా! సీత యెందుకూ?

శాంత—ముమ్మూరుపురి నీకన్నులనిండా ఆనత్యనూపు చూచుకుంటారా
నాయనా...

రామం—అమ్మా!

చ. మునుపటి ముగ్ధగా దివుడు ♦ ముద్దులకోడలుకూడ కాదు నా
కనువగు భాగ్యలక్ష్మి యన ♦ సంతోషమున్నుగ గాదు విన్నవిం

భువి బృహన్నళికీర్తి ♦ బూదిపాల్సేసిన
తారగాథనుకూడ ♦ ధరణి వినమె
పాండవపత్నియౌ ♦ పాంచాలి గర్భాని
మనమున కోరిన ♦ మాట వినమె
అలనాడు కైకేయి ♦ యారామచంద్రుని
వనికేగ చేసిన ♦ వార్త వినమె

తే. ఇంతకన్నను మించిన ♦ యింతు లపుడు
పరమపథమును విడనాడి ♦ తిరుగ లేదె
సీత వారలకన్న సు ♦ శీల యగునె
కాన స్త్రీలను నమ్మగా ♦ గలనె మాత!

శాంత—నీకు కలిగిన యనుమానపిశాచ భూతమే నిన్నిట్లు వేధించి నీరసింపచేయుచున్నది. కాని సీత మహాసాధ్వి. పాముకాళ్లు పాముకే తెలియవలయును. దొంగజాడ దొంగకే తెలియవలయును. అట్లే స్త్రీస్వభావము స్త్రీకే తెలియవలయును. పురుషుల కెట్లు తెలుస్తుంది.

రామం—దానికి వనమాస్ని జూచి నీవు పభ్రాంతి జెందిపోయావు? కాని "అతివినయం ధూర్తలక్షణమ్మనేటి" సూక్తిని నీవు గ్రహింపలేకపోయావు తల్లీ!

శాంత—నాయనా రామం! నూతిలోని నిప్పున్నదన్న యెవ్వరు నమ్మెదురు.

రామం—గంధపుచెట్టు పాములను చేరదీసుకొను నన్న నమ్మవా!

శాంత—విశ్వప్రేమమయురాలగు సీత ఒకరియొకనిని సోదరునిగా ప్రేమింపకూడదా లేక సిస్పృహిగానో పుత్రునిగానో ప్రేమింపకూడదా ప్రేమకు యెన్నమార్గాలు లేవా.

రామం—తల్లీ! నీ వెన్ని చెప్పినా నాబుద్ధి కెక్కడము లేదు. మాటిమాటికీ అతుక్ష్ఛవాంఛాలంపటికి పేరెత్తిన స్మేల వినికిస్తావా.

జననీ సీతను మరచిపోవాలి. నేను మరచిపోతాను. నాహృదయ మందిరములో దానికి తావు లేదు. నాస్వార్జితపుణ్య నాణ్యరాసులలో దానికి భాగము లేదు. బలవంతముగా వెడలగొట్టితిని. అబ్బా! ఆపాదమస్తకముగ నామనమున కెంత యశాంతి చేకూర్చినదీ నాటుకొనిపోయి వున్న ప్రేమమహావృక్షమునూ, పూతపూసి కాయలు కాసి పండి పండింపజేయవలసిన ప్రేమమహావృక్షమును బలవంతముగా నఱుకుచున్ననూ మరల మరల పిలక లెత్తుచున్నదే.

శాంత—రామూ! నీవు సున్మదావస్థలో నున్నావు. కన్నులార చూడకుండా. తగినంత నిదర్శనములు లేకుండా అట్టిఖండారోపణ పరాయమ్మ గన్నబిడ్డపై వేయకూడదు. నావంటి తెలుగు మాతలు సహింపరాని, మాటలివి. సిద్ధాన్నమును త్రోసివేసుకోవాకు—

రామం—నావిషయం నాకు తెలియును మాతా.

శాంత—హాబాధ! ఈబాధ సహింపరాని బాధ, భరింపరాని బాధ.

రామం—అమ్మా! అమ్మా! అదేమి టమ్మా అట్లా అంటున్నావూ?

శాంత—అదిగో! అదిగో.

రామం—అమ్మా! అట్లా చూస్తున్నావేమి టమ్మా.

శాంత—అదిగో పెద్దతుపాను.

రామం—ఏమి తుపానూ ఏమిమహాలోకం.

శాంత—పడవలో సముద్రప్రయాణము చేస్తున్న సీతచుట్టూతుపాను చెలరేగి భిన్నాభిన్నాలు చేస్తున్నది రా.

రామం—కలగంటున్నావా మాతా.

శాంత—కలగాదు. అతివిషమముగు సముద్రప్రవాహమ్ము నడుమ పడవ వొరగిపోవుటచే ప్రబాలింతరాలు కొట్టుకొని పోవుచున్నది నెట్లా! నాయనా త్వరగా పోవమ్మ.

రామం_మాతా! మనసును చెడిపో చేసుకొంటున్నావు.

శాంత_దైవానుగ్రహమున్న తీరంబునకు చేర్పఁగానగలుగుదువుపొమ్ము.

రామం_(తన) రోగపీడితురాలైన మాతృదేవికి అనాలోచితుడనై నామనోవేదన విన్నవించుటకూడా విపత్తుల్యమై పోయినదే. గ్రహచారము చాలనప్పు డట్టివిపత్తుల్లే సంభవించుచుండును.

శాంత_సీత! సీతా! అనుపూనమహాసముద్రములో కష్టాల తెప్పకొయ్యపై ప్రయాణాం చేస్తున్నావు. జారితే దుఃఖకెరటాలుకొట్టుక పోతవి జాగ్రత్త నేను పోతున్నా హా సీతా,

రామం_అమ్మా! అమ్మా.

శాంత_సీతా! సీతా! రామా! సీతా! హా బాధ. (ప్రాణాలు విడచును)

రామం_హామాతా! నన్ను వీడి పోతివా.

సీ. పుట్టినదాది నన్ ♦ పువ్వులలో నుంచి
పోషించె నెవ్వరు ♦ పొలుపుమీర
అహరహమ్ము నన్ను ♦ అతిశ్రద్ధతో లవ
కనురెప్ప లార్పక ♦ కాచె నెవరు
సంగీతశాస్త్రంబు ♦ చక్కగా చదివించి
సంతోష మొందిన ♦ సాధ్వి యెవరు
నీతివాక్యంబుల ♦ నిస్తులప్రేమతో
గఱపి తా నలరిన ♦ కాంత యెవరు

తే. కష్టపడి పెండ్లిచేసిన ♦ గరిత యెవరు
తండ్రి లేనట్టిలోటును ♦ తరిమె నెవరు
అట్టి జననియె అక్కటా ♦ యస్తమింప
నేమిసేయుదు చింతాగ్ని ♦ కేది నీరు.

(తెర వ్రాలును)

# తృతీయ రంగం.

---

(మాధవుఁడు చింతాక్రాంతచిత్తుఁడై మూల్గుచు కుర్చీలో కూర్చొని
యుండ సీత పిల్లవానిని జోకొట్టుచుండ, మన్మథుఁడు మాధవు
నకు సేవచేయుచుండ తెర లేచును)

సీత—బాబూ! ఏడవకు.

తే. భాగహీనైన చేయని ♦ కూఁతురుల కివు
డేల పుట్టితివో యయ్య ♦ యేడ్వ కయ్య
మనకు మించు దురదృష్ట ♦ మనుజమాత్రు
లెందు లేరయ్య యల్లరి ♦ యేటి కయ్య.

మన్మ—సీతా! పాపం తనపుత్రుని తాకనైనా చూడకుండా యెట్లా
వుండగలుగుచున్నాఁడో కదా.

సీత—సోదరా!

తే. పుట్టి పుట్టకమున్నె యీ ♦ పుత్రుఁ డయ్యొ
కన్నతండ్రికి వగతు ♦ నై కల్గినాఁడు
అన్నప్రాసనమైన నీ ♦ డయ్యెకడకు
సేయఁజూచునె యదికూడ ♦ చేయరేమొ.

మన్మ—ఊరుకో సీతా! తాతయ్య పుట్టెడుజబ్బులో నున్నాఁడు.

సీత—మన్మథా! నేటి కర్ధసంవత్సరమై పోయింది. ఇంతవరకూ మనము
వ్రాసిన పుత్తరాలకు ప్రత్యుత్తరాలు వచ్చుటకాని, అత్తయ్య
గారి కెట్లున్నదో జాడా జవాబుకాని రాకున్నది.

మన్మ—తిరిగి మొన్ననే మరొకజాబునుకూడా వ్రాశాను.

మాధ—దానికిమాత్రము తిరుగుజవాబు వ్రాస్తేగా—

సీత—మన్మథా! నాయెడ వారికింత ద్వేషమెందుకొచ్చిందో తుదకు కన్నకుమారుని కన్నులఁ జూచుకొనుట కైన రానంతటి యపచారము వారియెడల నే నేమి చేసియుండ లేదే! చివర కింత ఉత్తరవు ముక్కకైనా నోచుకోనక పోతినా — ఇక నాజన్మ మెందుకు మన్మథా!

మన్మ—సీతా! విచారింపకు చంద్రునికైనా క్షీణదశ వస్తు పోతుం టుంది. ఇక మానవులమగు మనకా—

సీత—నన్ను తీసుకొనిపోవుటకు వారే రావలయునా, రమ్మన్నప్పుడే పోవలయునని యే శాస్త్రములో నున్నదీ.

చ. ఇదివర కెందరో యబల ♦ లిట్టులె భర్తలు వీడిపోవగా
వదలక వారివెంట జని ♦ వాసిని గాంచగ లేదె మన్మథా!
మొదట శకుంతలాసతి ♦ ప్రమోదముతోడను భర్తవద్దకే
కదలి చనంగ లేదె తన ♦ కణ్వుని శిష్యులతోడ నేతయున్.
అట్టులే నేనుమాత్ర మేల పోకూడదూ.

మన్మ—సీతా! తాంత్యున్నస్థితి వదనిమ్ము అట్టులే పోవచ్చును.

సీత—నిజానిజములు గ్రహించుకోలేక యీగ్రామీయులు నన్ను మహాదుఃఖ్యబట్టుతున్నారు. నేను యెట్లు నిబ్బరించుకో గలుగుదునూ.

తే. అమ్మలక్కలు నాచుట్టు ♦ గ్రమ్ముకొనుచు
యత్తగారింటి కేల వీ ♦ వరుగ వైతి
వమ్మ యని నన్ను దుర్భావ ♦ లాడుచుండ
యెటుల సైరింతు దుఃఖాబ్ధి ♦ కేది యంతు.

వారు దుర్జనకోటిలోనివారై నచో వారినే యందురు. కానవ్వుడు నన్ను జూచి ప్రపంచం పూరుకుంటుందా.

మన్మ—సీతా! ఇది యన్యాయాప్రపంచం గనుక యెందుకూరు కొంటుందీ...

పోస్టు—(ప్రవేశించి) సీతాయమ్మగారూ!

సీత—ఎవరు (చూచి) పోస్టుజవానుగారా.

పో—ఔనమ్మా! మీకు ఉత్తరమున్నది. వేగ తీసికోండి. వెళ్ళాలి.

(అని యిచ్చి నిష్క్రమించును.)

మాధ—(ఆదరానంతో) సీతా యెవరు వ్రాసిరో పెద్దగా చదువు తల్లీ వింటాను.

సీత—చదువుతున్నాను తాతయ్యా! (అనుచూ కవరును విప్పి) ఆహా! నా హృదయేశ్వరుని కడనుండి జాబు యెన్నినాళ్ళకు చూడగలిగి తిని. (కన్నుల కద్దుకొని) శ్రీ శ్రీ శ్రీ సీతామహాదేవిగారికి రామం వ్రాసుకొనుచున్న విన్నపమేమనగా...? చూ చావా మన్మథా యెంతనిష్ఠూరముగా వ్రాశారో.

మన్మ—ఆతడు హాస్యప్రియుడు గనుక హాస్యముగ కట్లు వ్రాసియుండ వచ్చును. తరువాత.

సీత—నాజనని స్వర్గస్థురాలై సుమా రేడెనిమిది నెలలై పోయినది. హా! అస్తమించితివా అత్తయ్యా.

మాధ...కటకటా! హాళ్ళఘట్ట మనుకొనగా తుదకు విషాదఘట్టము గానే మారినదా—

మన్మ—కాయ పండి రాలిపోయినది. కనుక విచారపడ్డ ఫల ముం టుందా.

సీత—అటువంటి అత్తగారు యేడేడు పదనాల్గుజన్మాలకైనా లభ్యపడదు ఈపాపిష్టురాలికు అంత్యసేవలు చేసుకొను భాగ్యమైనా లేక పోయింది. అత్తయ్యా!

చ. ఇలవయి నెన్నొ నోములను ♦ యింపుతలిర్పగ నోముచేసి, స
త్ఫలసుమ భర్మహార్మ్యవని ♦ పాదులధర్మము లీయచేసి, నా

కాలమునను, గోత్రమున్ గృహము • కూడను ధన్యతనొందఁజేయుకో
డలవయితంచు యుబ్బి నను • డాసి నుతింపుడు యత్తకున్ ంకనే.

మన్మ—ఆధ్యాత్మికతత్వపరిశీలనోత్తమురాలవగు నీ వీ యిట్లు విచారింప
సామాన్యమానవులు నిన్ననుసరింపరాసీతా! విచారింపక ఆతరు
వాయినికూడా పూర్తిచెయ్యి.

మాధ—ఇంకెన్ని పిడుగువార్తలు వెలువడనున్నవో కదా.

సీత—(మరల చదువుచు) నే నిప్పు డొక నున్మత్తుడనై పోయాను. నా
కిప్పుడు మనశ్శాంతి లేదు. ఈమాయాప్రపంచాంధాకారగృహ
మున వెలుగు కానుపింపక యేమూల కొట్టుకుదునో యెచ్చటికి
కొట్టుకొనిపోవుదునో నాకు అంతు తెలియదు. బందరులో
చాలారోజులకిత్రమే నాజనని నివాసముంటూన్న గృహమును
కూడా ఖాళీచేసి వెడలిపోతిని. సన్యసింప తలంచితిని. కాని
ఆత్మ యింకనూ పరిశుభ్రతగాక యనుమాన పిశాచభూత విష
వికృతఘోరవక్త్రములలో చిక్కి వక్కలై పోతున్నది. నన్ను
మఱచిపోయితి ననుకొందును. మరచిపోవలయుననియే నాకుతూ
హాలముకూడా నీనవమన్మధుని మాత్రము మరువవలదని నా
విన్నపము.

ఇట్లు,

పూర్వపు రేడియో గాయకుడు నేడు నీవు చేసిన పిచ్చిసన్యాసి.

రామం

సీత—హా యెంతమోసము జరిగినది. హా నాధా! (అని మూర్ఛిల్లెను)

మన్మ—(చెవులు మూసికొని) హరి! హరీ! అతడు పండితుడే కావచ్చును.
కాని మానవనటన స్వాతాన్వేషణధురీణుడు కాడను కొందును.

మాధ—మన్మధా! చిక్కి శిథిలస్థితిలోనున్న నాగుండెయలలో రాముడు
వేసిన తుపాకిగుండ్లు నాటుకొని పోయినవి. తీసినను రావు

వచ్చినసూ కాముసు మాసును. మానినసూ ఖ్యాతిహీన జీవిత శేషాన్ని హాయిగా గడపలేను పాబాధ పాగుండియలలో యిముడుగుండ్లు, హాసీతా! అబ్బా అశాంతి అపవాదు అనుమానం. అనరాదు. వినరాదు. తలపరాదు. సీతను అనుమాన భూతాని కొప్పగించి పోతున్నా. కాపాడేవంతు నీయది. మన్మథా! బాధ—హా! (అని ప్రాణావశిష్టు డగును)

మన్మ—అస్తమించితివా భారతజాతి ననకల్పక భూరుహామా

తే. పతిప్రైకైనసూ అశ్రియు ♦ నర్థమున కలదు
సీత కెవరుండి రంచని ♦ శిథిలహృదయ
వీణతీగెలు కదలింప ♦ పాట మేగ
పోషణము లేని కవి కృతి ♦ పోయినట్లు

చ. కవి తనకావ్యకన్నియను ♦ కల్గినవానికి నాన్కియీయదు నీ
దవి పరిజ కందజేయకదె ♦ దిబ్బను పాలొనరింప నాడు నా
కలి మది యొంత క్రుంది తన ♦ కావ్యముకోసర మెంత యేడ్చునో
సువినయశీల సీతకయి ♦ క్రుమ్ముచు నుట్టులె కూలిపోతి నా.

(తెర వ్రాలును)

## చతుర్థ రంగం.

---

(పీడితహృదయుడైన రాముడు చెన్నపురి బజారులో)

రాము—(ప్రవేశించి)

చ. మతి మరిలేక నేను కోర ♦ మాలిన గాధవిషాదగేయముల్
చితికిన గొంతుకెత్తి ప్రజ ♦ చీయనుచుపాడుచు నూటిగాని భూ

పతనపము గాగ నున్నవర ♦ భక్తశిఖామణి త్యాగరాజ స
త్కృతులను పాడనైతి కదు ♦ కూడ నే నొక గాయకుండనే.

మరియు,

ఉ. ముందును వెన్కలారయక ♦ మూర్ఖుడ నొక్కు సుఖారిరాగమే
వందలసార్లు పాడుచును ♦ భారతభాసిన దేశమందు నే
నెందుకొ కాలయాపనము ♦ యేవరికేరక చేయుచుంటి హా
క్రిందటినాడు కన్నడపు ♦ కీర్తన ఖేదకకీర్తనయ్యెనే.

అదియునుంగాక,

చ. అదనుగ పిల్కలెత్తు యుము ♦ మానవిషాదకథావిధానమే
వదలక వ్రాయుచుంటి యుల ♦ వాల్మికివోలెను పుణ్యగాథలన్
పదిలముగాను వ్రాయుటకు ♦ ప్రస్తుతభావ మభావమాయె హా
కుదరక క్రుంగుచుండె కదు ♦ కూరిరుము పీడు కవీశ్వరుండొకో.

కటకటా!

ఉ. సీతను వీడియున్ హృదయ ♦ సీమను చిత్రవిచిత్రమౌ పటుల్
నూతనశిల్పకుండనయి ♦ నున్నని మిన్నగడ లేను రాలపై
సీతమనోహరాకృతిని ♦ చీటికిమాటికి పిచ్చివానికై
ఖ్యాతిగ చెక్కుచుంటి కను ♦ గానిక నే నొక శిల్పకుండనే.

ఇప్పుడు నేనెక్కడ నున్నానూ తెలిసినది.

చ. ఇది మహరాజు యే నిపుడు ♦ యిచ్చ్వాడ కెందులకొచ్చి యుంటినో
మదికిని తోచదాయె కదు ♦ మాసిన బట్టలతోడ నున్న నన్
పదుగురుస్నేహితుల్ గనిన ♦ ప్రాణము మింటికి లేచిపోవదే
యెద నను మెత్తురే యిటుల ♦ యేగిన నాదగు సాటిబాంధవుల్.

కావున ఇట్టిస్థితిలో యెచ్చటికీ పోరాదు. (తూలుతూ) అబ్బా ఆయాసం - అమ్మతోపాటు ఆనంద ఐశ్వర్యాలే గాకుండా అన్నపానాదులుకూడా అతిదూరమై పోయినవి. హా కన్నులు

మూాత బడిపోవుచున్నవి. గోంచెలు నేను ఈయిుటియరుగుపై విశ్రమిస్తా - హా సర్వేశ్వరా (అని సొంగిపోవును. దయార్ద్ర హృదయురాలగు రాజ్యం మిూరాయన కళ్ళుతుడుస్తూ రామాన్ని చూచి)

రాజ్యం——మొదట దెవరో భిక్షుకు డనుకొంటిని! హా రామమూ! అయ్యో నారామూ! నాప్రేమపు రామూ నీ స్థితి తుదకు యిూ రీతిగా పరిణమించెనేమి గానకుంటిరా—

ఉ. ఓమహనీయకోమలన ♦ వోదయకభారతభా . వభాస్కరా
శ్యామలగాత్రచారుతర ♦ శ్రావ్యసుగానకళావిశారదా
రామమ! నేడు నీనుదటి ♦ వ్రాతఫలంబిటులయ్యె నయ్యో న
త్ప్రేమముతోడ నిత్యమును ♦ వేడెడి కన్యతో వద్దురా ప్రభూ!

ఆలసింపరాదు. అదిగో యెవ్వరో వచ్చుచున్నారు వారినహాయము చేసి వీనిని గొనిపోయి వెంటనే చికిత్సలు చేయింపవలయును. లేకున్న ప్రమాదము. (సేవించు సేవలు చేస్తూండ )

(తెర వ్రాలును )

## పంచమ రంగం.

---

(గిరిరావు ఖాతా వ్రాసుకొనుచుండ మన్మథుని ప్రవేశము.)

మన్మ——గిరిరావుగారూ!

గిరి——ఎవరు వారు?

మన్మ——నేను మన్మథరావును.

గిరి—ఎందుకొచ్చావూ.

మన్మ—నీకు పెనిమిటికి మీరు ప్రియమిత్రులని తెలిసికొని మనవి చేసి కొనుటకు వచ్చితిని.

గిరి—చాలు - చాలు! మీచరిత్రంతా నాకు యిదివరకే తెలుసును. శ్రీముఖపని మీరివ్వబోవు మనవి చేయనక్కర లేదు.

మన్మ—యథార్థాన్ని మనవి చేసుకుంటాను.

గిరి—యథార్థమో! స్వార్థమో లేక నాశార్థమో ఇప్పుడదంతా యెవరికి కావాలి.

మన్మ— వింటే మీకే తెలుస్తుంది.

గిరి—విన్నాను. వింటున్నాను. ఇక విని మాత్రము చేసే దేమున్నది.

మన్మ—కాపురమును కుదుటపర్చగలరని, సీతయందు యేకొంచమేని యీ లోపము లేదనియు దైవసాక్షిగా మీకు మనవి చేసుకొంటున్నాను.

గిరి—నీవంటే చాలా! లోకమంతా కోడై కూస్తున్నా నమ్మకపోవుట యెట్లూ? సీత కాపురము యెగిరిపోవుటకు మూలకారకుడవు నీవే! నీవు చేసినకృత్యమే అదంతా! దానికిమాత్రం బుద్ధివుండనక్కర్లేదూ! గుట్టూమట్టయినా అక్కర్లేకుండా సీతతో సరస సల్లాపాలాడుతూ పైగా పక్కనాపుకుంటూంటే ప్రపంచ మేమనుకొంటుందోనన్న సిగ్గయినావున్నదా దానికిగానీ నీకుగానీ.

మన్మథు—గిరిరావుగారూ యథార్థాన్ని వూహించకపోయినా వూహించకుండ తిడుతారు లేగాక తెలిసినవారు తమరు కూడా నమ్మిరువ్వరినీ అబాంధపాలు చేయడం మహాపాపం సుమా! మీరుకాబట్టి సహించగలిగితిని. ఇట్టిమాటలు మరిరొకరెవరైనా అనిసచో తక్షణమే వాడివక్షస్థలాన్ని పగలకొట్టి పోయేవాడిని.

గిరి—పాపిష్టుడా పైగా నాయింటికొచ్చి ప్రగల్భాలాడుతున్నావా. పండ్లూడగొట్టి పంపిస్తా ముందు నాగడపదిగు.

మన్మ—చాలా గొప్పపనే చేయిస్తారు.

చ. సరిసరి నోరుమూయు మిక ♦ చాలును నీతకు నాకు మన్మథా
విరివిగ అంకుగట్టినవు ♦ వీధికి పాలొనరించ యిమ్మెయిన్
మెఱుగుచు నుంటివా తెలుగు ♦ మొల్క తరాలగుణాలుగల్గునా
పరమ సుశీల నాయుపర ♦ భారతి నాకొక చెల్లెలా సుమా!

గిరి—ఛండాలుడా! నామిత్రుని జీవితాన్ని ధ్వంసం చేయడమే కాకుండా యథార్థాన్ని వెలిబుస్తున్నానన్న యీర్ష్యతో లతాధి కారుడగు యీగిరిరావునే నోరుమూయుమను చుంటివిగా (రూళ్ళకఱ్ఱతో కొట్టుతూ) చావు చచ్చువెధవా చావు. (అని నెట్టివేయును.)

మన్మ—నిజముగా సీత పతివ్రతేగనక్కైతే నన్ను కొట్టినచేతికి కుష్ఠు పుట్టియే తీరుతు. (శపించి నిష్క్రమించును.)

తెర వ్రాలును.



